# నరేంద్ర మండలి సమావేశము

## సంస్థానాధీశులకు రాజప్రతినిధి హితవు

లా అందు ఆర్డరు ప్రజల యభీష్టము ననుసరించి యుండదగును. వ్యక్తిస్వాతంత్ర్యమును, హక్కులను సంరక్షింప వలయును. న్యాయశాఖపై కార్యనిర్వాహక శాఖకెట్టి హక్కు నుండరాదు పన్నులు తేలికగ నుండవలయును.

సమాహార విధానమును సంస్థానాధీశు లంగీకరించిరి.

మార్చినెల ౨౮ వ తేదిన ఢిల్లీనగరమునందు నరేంద్రమండలి సమావేశము ప్రారంభమయ్యెను. అందు రాజప్రతినిధియగు ఇర్విన్ ప్రభువు సంస్థానాధీశుల కర్తవ్యములు గూర్చి గంభీరోపన్యాసము గావించిరి. దానినుండి దిగువ భాగములు ముద్రితములు:—

సంస్థానాధీశులకు నేను స్వాగత మిచ్చుట కిది అయిదవ పర్యాయము సంస్థానాధీశులు సమావేశమగుట ఇది పదియవ పర్యాయము ఈ ౧౦ సంవత్సరముల కాలములో ఈ సమావేశముల వల్ల సంస్థానాధీశులకును కలిగిన లాభమును పరిశీలించెదము. ఈ సందర్భమున ముఖ్యముగ గమనింపవలసినది. రౌండుటేబిలు సమావేశము. విక్టోరియా మహారాణిగారి ప్రకటనకన్నను, బ్రిటిషు ప్రభుత్వమువారితో మీరు గావించుకొనిన ఒడంబడికలకన్నను రౌండుటేబిలు సమావేశపు ఫలితములు మిగుల ప్రాముఖ్యమైనవని చెప్పవలెను. రౌండుటేబిలు మహాసభయందు సంస్థానాధీశులు ప్రకటించిన అభిప్రాయములకు పునాది ఈ సంవత్సరము ఇచ్చుటనే వేయబడినది. భావికాలమున భారతదేశ చరిత్రయందీ మహాసభ ఎట్టిస్థానము నలంకరించునో చెప్పుటకు వీలులేదు. బహుశః ఈ మహాసభ ఉద్దేశము నెరవేరినదనియు ఫెడరేటెడ్ ఇండియాసభలకు ఈ మహాసభ ఎడము ఇవ్వవలసి వచ్చునని యూ తోచుచున్నది. భావి పరిణామ మే విధముగ నున్నను ఇంతవరకు ఈ మహాసభ వారు గావించిన కృషి మిగుల ప్రశంసనీయమయినదని అంగీకరింపవలెను.

సంస్థానాధీశుల ప్రతినిధులు లండనకు ప్రయాణమయినప్పుడు రౌండుటేబిలు మహాసభ చర్చల ఫలితములు ఈ విధముగ నుండునని యు అట్టి పరిణామమునకు సంస్థానాధీశుల ప్రకటనయే కారణముగ నుండుననియు ఎవ్వరు ఊహించి యుండజాలరు. కడచిన సంవత్సరము జూలై నెలలో మీరిచ్చట సమావేశమైనప్పుడు ఫెడరలు విధానమువల్ల సంస్థానములకు బ్రిటిషు ఇండియనుకు కలుగు లాభములను గురించి మీలో కొందరితో ప్రసంగించియుంటిని. ఆర్థిక విషయములందు ఒకే విధాన మవలంబించుటవల్ల ఉభయ పక్షముల వారికి కలుగు లాభములను కొందరికి వివరించియుంటిని కాని సంస్థానాధీశులు తమస్వాతంత్ర్యములను కొంతవరకు వదలుకొని ఫెడరేషను యందు చేరుటకు అంగీకరించెదరని నాకప్పుడు తోచలేదు. భారత దేశమున కంతయు ఒకే ప్రభుత్వముండవలయు ననియు అట్టి ఫెడరేషనునందు సంస్థానాధీశులు చేరుటకు సంస్థానాధీశులు సంసిద్ధులై యున్నారనియు మా ప్రతినిధులు లండనులో గావించిన గొప్ప ప్రకటన నా కెంతయో సంతోషమును కలుగజేయుచున్నది. ఫెడరేషను ఏర్పరచు విషయమై ఇక ముందు జరుగగల చర్చల యందుకూడ సంస్థానాధీశులందరు కలసి భావి రాజ్యాంగ నిర్మాణ మేర్పరచు విషయమున తోడ్పడెదరని నమ్ముచున్నాను.

తరములనుండి వచ్చుచున్న ప్రాచీన సాంప్రదాయములను విడనాడి మీరు నూతన పథము ద్రొక్కనున్నారు ఇంతవరకు మీరు ప్రాచీన సాంప్రదాయముల ననుసరించి మీరు రాష్ట్రములందు స్వతంత్రులయి పరిపాలనము జరుపుచుండిరి సంస్థానాధీశుల పరిపాలనాదరములు క్రమముగ మారినవి. సంస్థానాధీశుల బాధ్యతను గురించి ధర్మములను గురించియు కొంత చెప్ప నుద్దేశించుచున్నాను. ప్రభుత్వ నిర్మాణము ఏవిధముగ నున్నను అనగా నిరంకుశాధికారియగు రాజు పరిపాలించుచున్నను లేక సాంప్రదాయములకు బద్ధులయిన రాజు పరిపాలన మైనను లేక ప్రజాయత్త పరిపాలనమైనను, ప్రజల క్షేమమును దృష్టియందుంచుకొని పరిపాలన జరుపుటపై ఆ పరిపాలన గొప్పతనము ఆధారపడియుండును. ప్రజల క్షేమమునకు ప్రధానమగు విషయములను వివరించెదను. సంఘము ఆమోదించు చట్టముల ననుసరించి పరిపాలనము కొనసాగుచుండవలెను. వ్యక్తి స్వాతంత్ర్యమును పౌరసత్వపు హక్కులను ప్రభుత్వము వారు సంరక్షించుచుండవలెను. చట్టముల ననుసరించి ప్రజలందరు సమానులను సిద్ధాంతముపై పరిపాలన కొనసాగవలెను. ఇందులకు చక్కని నిర్మాణముతో కూడిన పోలీసుదళము అవసరము. ఇందులకు తోడు న్యాయ పరిపాలనా విధానము చక్కగ నేర్పరుపవలెను. ఎక్జిక్యూటివు ప్రభుత్వమువారికి న్యాయమూర్తులపై ఎట్టి యధికారము నుండకూడదు. సాధ్యమైనంతవరకు పన్నులభారము తక్కువగ నుండవలెను. ప్రజల ఆర్థిక స్థితికి తగినట్లుగ పన్నులుండవలెను. సంస్థానాధీశుని గౌరవము ప్రతిష్ఠ కాపాడు కొనుటకు తగినంత మాత్రపు ధనమునే సంస్థానాధీశుడు తన ఖర్చులకై వ్యయము చేసుకొనవలెను. మిగత మొత్తము సంఘ జీవితమును అభివృద్ధిపరచుటకు అనగా విద్య ఆరోగ్యము, వ్యవసాయము, వసతులు రోడ్లు మొదలగు సౌకర్యములను వృద్ధిచేయుటకై వినియోగింప బడవలెను. ప్రజల కష్టసుఖములను వారి కోరికలను తెలిసికొనుటకు తగు ఏర్పాటులుండవలెను. పాదకులకు పాలితులకును పరస్పర సంబంధముండవలెను. మతవిషయములందు సహనముండవలెను. తగవులను రాజీ పరచుటకు తగు ఏర్పాటు లొనర్పవలెను. వీటన్నిటికంటెను ముఖ్యమైనది సంస్థానాధీశుడు ప్రజాగౌరవ విశ్వాసములకు పాత్రులయిన మంత్రుల సహాయమును పొందుచుండవలెను.

భావినిర్మాణమున మీకు రాజప్రతినిధిద్వారా సార్వభౌమునితో ప్రత్యక్షసంబంధ మేర్పడును. మీ ఒడంబడికలు ప్రస్తుతము వలెనే సంపూర్ణముగ గౌరవింపబడును. కావున మీ ప్రజలు గర్వపడు విధమున మీకు ఎదురొన వచ్చిన సమస్యలను సాహసముతోను ధైర్యముతోను పరిష్కరింపవలెను. మీ శుభముకోరుచు మీ సెలవు తీసికొనుచున్నాను

### ఫెడరేషను నామోదించుట

సంస్థానాధీశుల ఇష్టాగోష్ఠి మహాసభయందు సంస్థానముల పరిపాలన నందును ఆర్థికవిషయములందును స్వాతంత్ర్యముతో కూడిన ఫెడరేషను విధానమును అంగీకరించుచు భారతదేశము ప్రతినిధులతో ఈ విషయమయి చర్చలు జరుపుటకు ఒక తీర్మానము సంస్థానాధీశుల మహాసభయందు పరిపాలింపవలయునని అంగీకరింప బడెను. ఫెడరేషను విధానమువల్ల సంస్థానాధీశుల వ్యక్తిత్వము నశించునని పలువురు అభిప్రాయము తెలిపిరి.

### తీర్మానములు

మార్చి ౨౭-౧౮ వ తేదులయందు నరేంద్రమండలి యొక్క ఇష్టాగోష్ఠి సమావేశము జరిగెను. ౧౮ వ తేదిన తీర్మానములు గావింపబడెను. చక్రవర్తిగారిపై తమకుగల భక్తివిశ్వాసములను వెల్లడింపబడెను. రాబోవు రాజ్యాంగ విధానములో అర్హమైన స్థాన మొసగుటకు చక్రవర్తి ప్రభుత్వము వారును, బ్రిటిషు రాజకీయ పక్షములును, తోడ్పడినందుకు ప్రశంసింప బడెను. ప్రతి సంస్థానము భావిరాజ్యాంగ విధానములో తమహక్కుల గూర్చి ప్రత్యేకముగ రాయబారములు జరుపుటకును, సదరివిషయము నరేంద్రమండలి అనుమతిపై జేయుటకును, తీర్మానింపబడెను. సంస్థానాధీశులయెడ ఇర్విను ప్రభువు గనపరచిన సానుభూతికి కృతజ్ఞత దెలుపబడెను.

